

## జగద్గురువుల ఆశీస్సులతో...

జయతు భరత క్షోణీఖణ్డం విషాదవివర్జితం జయతు గణపస్తస్య క్షేమం విధాతుమనా మునిః।
జయతు రమణస్తస్యాచార్య మహర్షికులాచలో జయతు చ తయోర్మాతా పూతా మహేశవిలాసినీ॥

భారతీయ సిద్ధాంతమును సరళమైనటువంటి విధానములో ప్రపంచం నలుమూలలా ఉన్నటువంటి భారతీయులు తేలికపాటి ప్రయత్నాలతో అనుసరించాలి, అనుసరించేలాగా మనం వారికి విజ్ఞానాన్ని అందించాలి అనే తపనతో జగద్గురు కంచిపీఠం అవధూత శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీ దత్తపీఠం ఎంతో కృషి చేస్తున్నది. వారి ఆశయాలకు తగినవిధంగా మా వంతు కృషిగా పంచాంగ గణితము చేయుచున్న నేను ఈ పంచాంగాన్ని ప్రపంచంలోని భారతీయులందరూ సరళమైనటువంటి విధానాలతో అనుసరించేలాగా తయారుచేయడం జరిగినది. జగద్గురు కృపా కటాక్షాలను ఆశిస్తూ... రాబోవు సంవత్సరం మరిన్ని ఆకర్షణీయమైనటువంటి పంచాంగ విషయాలనుఇందులో పొందుపరచు విషయంగా, పాఠకుల సలహాలను కూడా కోరుతూ...

మీ

మార్తి శివరామ యజ్ఞ నారాయణ శర్మ

పంచాంగకర్త, USA. Ph :+1(562)453-8597

కప్పగన్తు సుబ్బరామ సోమయాజులు

వ్రత, ముహుర్తాది విషయ సహ రచయిత Ph : 9848520336

ప్రపంచదేశాలలోని సుముహూర్తాలు కావలసినవారు మమ్మల్ని స్వయంగా సంప్రదించగలరు.

ప్రతులకు
శివకామేశ్వరి గ్రంథమాల
41-22/4-36, భ్రమరాంబాపురం,
కృష్ణలంక, విజయవాడ - 13.
ఫోన్ : 0866-6661777
V.P.P. సౌకర్యం కలదు

ఆన్‌లైన్‌లో ప్రతులకు
amazon.com
Kinige

విజేత బుక్స్ 24-14-45, సాయి రెసిడెన్సీ, 2వ అంతస్తు, కుందేటివారి వీధి, బావాజీ పేట, విజయవాడ - 3. సంచారవాణి : 98 48 68 76 52

శ్రీ శార్వరి నామ సంవత్సర గంటల పంచాంగము 2020-2021

వెల : 75 రూ.

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ పరదేవతా పరిపాలిత సాయన - నిరయన సమన్వయ
సనాతన ధర్మ సమ్మత

# శ్రీ మార్తి వారి
# శ్రీ శార్వరి నామ సంవత్సర
# ఆర్షభారతీ గంటల పంచాంగము




జగద్గురు కంచిపీఠం మరియు అవధూత గణపతి సచ్చిదానందస్వామి వారి పీఠములు అనుసరిస్తున్న చైత్రపక్ష పంచాంగ విధానముతో కూడిన పంచాంగము ఇవ్వడమైనది.

న్యూయార్క్, లాస్ఏంజెల్స్, చికాగో, టొరంటో, సింగపూర్, సిడ్నీ, లండన్, అబుధాబి ప్రాంతములకు సంబంధించిన పంచాంగ వివరములు ఇవ్వబడి, భారతదేశము నుండి విడుదలవుతున్న ఏకైక పంచాంగము

వెల : 75 రూ.

పంచాంగకర్తలు



బ్రహ్మశ్రీ మార్తి శివరామ యజ్ఞనారాయణ శర్మ
USA. Ph :+1(562)453-8597

వ్రత, ముహుర్తాది విషయ సహ రచయిత
బ్రహ్మశ్రీ కప్పగన్తు సుబ్బరామ సోమయాజులు
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర దేవాదాయ ధర్మాదాయ శాఖ ఆస్థాన సిద్ధాంతి
Ph : (+91) 9848520336





శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు



శ్రీ మహాగణాధిపతయే నమః





✡ శ్రీ పరదేవతా పరిపాలిత ✡

సాయన - నిరయన సమన్వయ

సనాతన ధర్మ సమ్మత

## శ్రీ మార్తి వారి

# శ్రీ శార్వరి నామ సంవత్సర

# ఆర్షభారతీ గంటల పంచాంగము

# 2020 - 2021



పంచాంగ కర్త

కీ॥శే॥ బ్రహ్మశ్రీ యజ్ఞ నారాయణ శర్మ గారి పౌత్రుడు,

కీ॥శే॥ బ్రహ్మశ్రీ లక్ష్మీ నారాయణ శాస్త్రి గారి పుత్రుడు,

**శ్రీ మార్తి శివరామ యజ్ఞనారాయణ శర్మ**

# పంచాంగ పద్ధతి వివరణ

ఈ పంచాంగము యందు కాలమానము విజయవాడ 16°31'N 80°37'E ప్రాంతమునకు సరిచూపబడినవి. శ్రౌత స్మార్త కర్మానుష్ఠానమునకు యోగ్యంబుగా సరిపోయే తిథి, నక్షత్ర, యోగ, కరణాదులు గంటలలో ఇవ్వబడినవి. ఇందు దుర్ముహూర్తం, వర్జ్యం, అమృత ఘడియలు, లగ్నాంతకాలాలు, శుభ ముహూర్తములు ఇత్యాదివన్నియునూ కూడా గంటలలో ఇవ్వటమైనది. అన్నింటికీ అంత్యకాలాలు ఇవ్వడమైనది. గ్రహ సంచారం ప్రత్యక్ష దృగ్గోచరమునకు, ఆధునిక ఖగోళశాస్త్ర పరిశోధనకు సరిపోవు విధానంగా నిరయణ గ్రహ స్ఫుటములు ఇవ్వటం జరిగినది. సనాతన జ్యోతిషశాస్త్రం అనుసరించి కొన్నిచోట్ల సాయనం, కొన్నిచోట్ల నిరయణం సమన్వయం చేసి ఇవ్వబడినవి. ఇందు సూర్యోదయం, సూర్యాస్తమయము సనాతన ధర్మసమ్మత్తముగా భానుడి మధ్యోదయ ప్రమాణముకు ఇవ్వటమైనది. ఇందు సాయన గణితం ఆధునిక దృక్‌కి సరిపోవును. ఇందు నిరయణమునకు సౌరాదిశాస్త్రము ద్వారా కాకుండా ఆధునిక పరికరాల ద్వారా పరిశోధించి ప్రత్యక్ష నిరూపణకు సరిపడుగా ట్రూ లాహిరి చైత్రపక్ష అయనాంశతో సరిపడుగా ఇచ్చినవి. ఈ ఆధునిక ధృక్ సాధనకు పూర్తిగా స్విస్ ఎఫిమెరీస్‌ఫైల్స్ వాడి వాటి ద్వారా గణితము చేయటమైనది. సులభత్వము కొరకు కంప్యూటరు ద్వారా చేయటమైనది. సశాస్త్రీయంగా సూర్యసిద్ధాంతము నుండి భారతీయ వైదిక శాస్త్రీయ బీజ సంస్కారాల ద్వారా ఆధునిక ధృక్ సాధించు విధానము కనుగొనిన యెడల, స్విస్ ఎఫిమెరీస్ మాని ఆ విధంగానే భవిష్యత్తులో పంచాంగం చేయటం జరుగును. ఈ పంచాంగంలో ఇచ్చినవి అన్నీ పునః పరిశీలన చేసి సరిచేయటమైనది. కానీ ఎంత చేసినా కొన్ని లోపాలు, అచ్చుతప్పులు ఉండవచ్చు. కావున పంచాంగం వాడేవారు వాటిని మా దృష్టికి తెచ్చిన యెడల రాబోవు సంచికలో సరిదిద్దగలము.

# పంచాంగ శాస్త్రీయతపై వివరణ

ప్రస్తుతము మనకు ఆంధ్రదేశమున లభ్యమవుచున్న పంచాంగాలు 4 రకాలు. 1.పూర్తి పూర్వ పద్ధతి, 2. రవి చంద్రులు పూర్వ పద్ధతి. కుజాది సప్త గ్రహాలు ధృక్ పద్ధతి. ఈ రెండింటిలోనూ కూడా గ్రహణాలకు ధృక్ గణితాన్నే వాడుతున్నారు. 3. ధృక్ పద్ధతి, 4. చాయార్క సంస్కృత కరణార్క పద్ధతి. ధృక్ వాళ్ళు సూర్యసిద్ధాంతం నుండి గ్రహ సాధన చేసి తరువాత ఆధునిక బీజ సంస్కారాలు పాశ్చాత్య విధానం ఆధారంగా చేస్తారు. 4వ విధానంలో కేరో లక్ష్మణ్ ఛత్రే గారు వ్రాసిన గ్రహసాధన కోష్ఠకం, కేత్కార్ గారు వ్రాసిన జ్యోతిర్గణితం వాడతారు. ఈ రెండు గ్రంథాలు పాశ్చాత్య గణితం ఆధారం చేసుకుని వచ్చినవే. శాస్త్రీయ పద్ధతిలో వచ్చినవి కాదు. ఏది ఏమైనా 3, 4 పద్ధతులలో దాదాపు 70% పాశ్చాత్య గణితం ఉన్నది. ఇక ఇప్పుడు నేను వ్రాసిన పంచాంగంలో పూర్తిగా స్విస్ ఎఫిమెరీస్ వాడి సనాతన సంప్రదాయంకి తగినట్టుగా సాయన నిరయణ సమన్వయం చేసి వ్రాయటమైనది. కావున మా పంచాంగం కూడా పై వారి విధానములుగా శాస్త్రీయమైనవే అని విన్నపం.

# నవగ్రహ స్తోత్రము



శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోప శాంతయే

శ్లో॥ శ్రీమన్నృసింహ విభవే గరుడధ్వజాయ
తాపత్రయోపశమనాయ భవౌషధాయ
తృష్ణాదివృశ్చిక జలాగ్నిభుజంగరోగ
క్లేశవ్యయాయ హరయే గురవే నమస్తే

శ్లో॥ ఆదిత్యాయచ సోమాయ మంగళాయ బుధాయ చ,
గురుశుక్రశనిభ్యశ్చ రాహవే కేతవే నమః

శ్లో॥ జపాకుసుమ సంకాశం, కాశ్యపేయం మహాద్యుతిమ్ ।
తమోరిం సర్వపాపఘ్నం ప్రణతోస్మి దివాకరమ్ ॥ (రవి)

శ్లో॥ దధిశంఖ తుషారాభం, క్షీరోదార్ణవ సంభవమ్ ।
నమామి శశినం సోమం, శంభోర్మకుట భూషణమ్ ॥ (చంద్ర)

శ్లో॥ ధరణీగర్భ సంభూతం విద్యుత్కాంతిసమప్రభమ్
కుమారం శక్తి హస్తంచ, మంగళం ప్రణమామ్యహమ్ (కుజ)

శ్లో॥ పియంగు కలికాశ్యామం, రూపేణాప్రతిమం బుధమ్ ।
సౌమ్యం సత్వగుణోపేతం, తం బుధం ప్రణమామ్యహమ్ ॥ (బుధ)

శ్లో॥ దేవానాం చ ఋషీణాం చ గురుం కాంచన సన్నిభమ్ ।
బుద్ధిమంతం త్రిలోకేశం, తం నమామి బృహస్పతిమ్ ॥ (గురు)

శ్లో॥ హిమకుంద మృణాలాభం, దైత్యానాం పరమం గురుమ్ ।
సర్వశాస్త్ర ప్రవక్తారం, భార్గవం ప్రణమామ్యహమ్ ॥ (శుక్ర)

శ్లో॥ నీలాంజన సమాభాసం, రవిపుత్రం యమాగ్రజమ్ ।
ఛాయామార్తాండ సంభూతం, తం నమామి శనైశ్చరమ్ ॥ (శని)

శ్లో॥ అర్ధకాయం మహావీరం, చంద్రాదిత్య విమర్దనమ్ ।
సింహికాగర్భసంభూతమ్, తం రాహుం ప్రణమామ్యహమ్ ॥ (రాహు)

శ్లో॥ పలాశ పుష్పసంకాశం తారకాగ్రహ మస్తకం ।
రౌద్రం రౌద్రాత్మకమ్ ఘోరం, తం కేతుం ప్రణమామ్యహమ్ ॥ (కేతు)

# పితృదేవతా స్తోత్రము

## (శ్రీ మార్కండేయ పురాణాంతర్గతం)

### ఫలశ్రుతి

రుచి అనబడే ఒక ప్రజాపతి పితృదేవతలపై రచించిన స్తోత్రం పితృదేవతా స్తోత్రము అని పిలవబడుతున్నది. ఈ స్తోత్రం భక్తితో పఠించిన వారికి సంతానం కలుగుతుంది. దీనిని శ్రాద్ధకాలంలో భోక్తలకు ఎదురుగా కూర్చుని కర్త పఠిస్తే అది అక్షఫలితం ఇస్తుంది. వంశం అభివృద్ధి చెందు తుంది. అమావాస్య, సంక్రమణ మొ॥ పర్వకాలాలలో పఠిస్తే సంపదలు పెరుగుతాయి. ఈ స్తోత్రం పుష్కరాలలో మరియు క్షేత్రాలలో చదివితే అఖండ పుణ్యం, నరక విముక్తి లభిస్తాయి. ఈ స్తోత్రాన్ని అందరూ పఠించవచ్చు.

1. నమస్యేఽహం పిత్రూన్ శ్రాద్ధే యే వసన్త్యధిదేవతాః ।
   దేవైరపిహి తర్ప్యంతే యేచ శ్రాద్ధే స్వధోత్తరైః ॥
2. నమస్యేఽహం పిత్రూన్ స్వర్గే యే తర్ప్యన్తే మహర్షిభిః ।
   శ్రాద్ధైః మనోమయైః భక్త్యా భుక్తి ముక్తిమభీప్సుభిః ॥
3. నమస్యేఽహం పిత్రూన్ స్వర్గే సిద్ధాః సన్తర్పయంతి యాన్ ।
   శ్రాద్ధేషు దివ్యైః సకలైః ఉపహారై రనుత్తమైః ॥
4. నమస్యేఽహం పిత్రూన్ భక్త్యా యేర్చ్యన్తే గుహ్యకైరపి ।
   తన్మయత్వేన వాచద్భిః బుద్ధిమాత్యన్తికీం పరామ్ ॥
5. నమస్యేఽహం పిత్రూన్ మర్త్యైః అర్చ్యంతే భువి యే సదా ।
   శ్రాద్ధేషు శ్రద్ధయాఽభీష్ట లోకప్రాప్తి ప్రదాయినః ॥
6. నమస్యేఽహం పిత్రూన్ విప్రైః అర్చ్యన్తే భువి యే సదా ।
   వాంఛితాఽభీష్ఠ లాభాయ ప్రజాపత్యా ప్రదాయినః ॥
7. నమస్యేఽహం పిత్రూన్ యేవై తర్ప్యంతేఽరణ్యవాసిభిః ।
   వ న్యైః శ్రాద్ధైః యతాహారైః తపో నిర్ధూత కిల్బిషైః ॥
8. నమస్యేఽహం పిత్రూన్ విప్రైః నైష్ఠిక వ్రతచారిభిః ।
   యే సంయతాత్మభి: నిత్యం, సంతర్ప్యంతే సమాధిభిః ॥
9. నమస్యేఽహం పిత్రూన్ శ్రాద్ధైః రాజన్యా స్తర్పయంతియాన్ ।
   కవ్యై రశేషైః విదివ ల్లోకత్రయఫలప్రదాన్ ॥

10. నమస్యేఽహం పిత్రూన్ వైశ్యైః అర్చ్యంతే భువి యే సదా ।
స్వ కర్మాభిరతైర్నిత్యం పుష్పైః ధూపాన్నఽ వారిభిః ॥
11. నమస్యేఽహం పిత్రూన్ శ్రాద్ధైః యే శూద్రైరపి భక్తితః ।
సంతర్ప్యన్తే జగత్యత్ర నామ్నా ఖ్యాతాః సుకాలినాః ॥
12. నమస్యేఽహం పిత్రూన్ శ్రాద్ధైః పాతాలే యా మహాసురైః ।
సంతర్ప్యన్తే స్వధా హారాః త్యక్త దమ్భమదైః సదా ॥
13. నమస్యేఽహం పిత్రూన్ శ్రాద్ధైః అర్చ్యన్తే యే రసాతలే ।
భోగైరశేషైః విధివన్నాగైః కామానభీప్సుభిః ॥
14. నమస్యేఽహం పిత్రూన్ శ్రాద్ధైః సర్పైః సన్తర్పితాన్సదా ।
తత్రైవ విధివన్మన్త్ర భోగ సమ్పత్సమన్వితైః ॥
15. పితృన్న మస్యే నివసంతి సాక్షాద్ యేదేవలోకే చ తథాఽన్తరిక్షే ।
మహీతలే యే చ సురాది పూజ్యాః తే మే ప్రతీచ్ఛన్తు మయోపనీతమ్ ॥
16. పితృన్న మస్యే పరమాత్మ భూతా యే వై విమానే నివసంతి మూర్తాః ।
యజన్తి యాన్, అస్తమలైః మనోభిః యోగీశ్వరాః కేశవిముక్తి హేతూన్ ॥
17. పితృన్న మస్యే దివి యే చ మూర్తాః స్వధాభుజః కామ్యఫలాభిసన్ధౌ।
ప్రదాన శక్తాః సకలేప్సితానాం విభుక్తిదా యేఽనభి సంహితేషు ॥
18. తృప్యన్తు తేఽస్మిన్పితరః సమస్తా ఇచ్ఛావతాం యే ప్రదిశంతి కామాన్ ।
సురత్వ మింద్రత్వమతోఽధికం వా సుతాన్ పశూన్ స్వాని బలం గృహాణి ॥
19. సోమస్య యే రశ్మిషు యేర్కబింబే శుక్లే విమానే చ సదా వసంతి ।
తృప్యన్తు తేస్మిన్ పితరోన్నతో యైః గంధాదినా పుష్టిమితో వ్రజంతు ॥
20. యేషాం హుతేఽగ్నౌ హవిషా చ తృప్తిః యే భుంజతే విప్రశరీరసంస్థాః ।
యే పిండదానేన ముదం ప్రయాంతి, తృప్యంతుతేఽస్మిన్ పితరోన్నతోయై ॥
21. యే ఖడ్గమాంసేన సురైరభీష్టైః కృష్ణైః తిలైర్దివ్య మనోహరైశ్చ ।
కాలేన శాకేన మహర్షివర్యైః సంప్రీణితాస్తే ముదమత్ర యాన్తు ॥
22. కవ్యాన్యశేషాణి చ యాన్య భీష్టాన్ అతీవ తేషామమరార్చిఽతానామ్ ।
తేషాం తు సాన్నిధ్య మిహాఽస్తు పుష్ప గంధాఽన్నభోజ్యేషు మయా కృతేషు ॥
23. దినే దినే యే ప్రతిగృహ్ణతేఽర్చాం మాసాంత పూజ్యాం భువియేఽష్టకాసు ।
యేవత్సరాఽంతేఽభ్యుదయే చ పూజ్యాః ప్రయాంతు తే మే పితరోత్ర తృప్తిమ్ ॥
24. పూజ్యా ద్విజానాం కుముదేందుభాసో, యే క్షత్రియాణాం చ నవాఽర్కవర్ణాః।
తథావిశాం యే కనకాఽవదాతా నీలీనిభాః శూద్రజనస్య యే చ॥

25. తే ఽ స్మిన్సమస్తా మమ పుష్పగంధ ధూపాన్నతోయాదినివేదనేన
తథాగ్నిహోమేన చ యాంతు తృప్తిం సదా పితృభ్యః ప్రణతో ఽ స్మి తేభ్యః ॥
26. యే దేవపూర్వాణ్యతి తృప్తి హేతో! అశ్నంతి కవ్యాని శుభాహుతాని
తృప్తాశ్చ యే భూతిసృజో భవంతి తృప్యన్తు తే బ స్మిన్ ప్రణతో ఽ స్మి తేభ్యః ॥
27. రక్షాంసి భూతాన్యసురాంస్తథోగ్రాన్ నిర్నా శయన్తస్త్వ శివం ప్రజానామ్।
ఆద్యాః సురాణామమరేశ పూజ్యా తృప్యంతు తే ఽ స్మిన్ ప్రణతో ఽ స్మి తేభ్యః ॥
28. అగ్నిష్వాత్తా బర్హిషద ఆజ్యపాః సోమపాస్తథా ।
ప్రజంతు తృప్తిం శ్రాద్ధే ఽ స్మిన్ పితరస్తర్పితా మయా ॥
29. అగ్నిష్వాత్తాః పితృగణాః ప్రాచీం రక్షంతు మే దిశమ్ ।
తథా బర్హిషదః పాంతు యామ్యాం యే పితరః స్మృతా ॥
30. ప్రతీచీ మాజ్యపాః తద్వదుదీచీమాపి సోమపాః ।
రక్షోభూతపిశాచే ఽ భ్యః తథైవా ఽ సురదోషతః ॥
31. సర్వతశ్చాధిపస్తేషాం యమో రక్షాం కరోతుమే ।
విశ్వో విశ్వభుగారాధ్యో ధర్మో ధన్యః శుభాననః ॥
32. భూతిదో భూతికృద్భూతి: పిత్రూణాం యే గణా నవ ।
కళ్యాణ: కల్యతాకర్తా కల్యః కల్యతరాశ్రయః ॥
33. కల్యతాహేతురానఘః షడిమే తే గణాః స్మృతాః ।
వరో వరేణ్యా వరదః పుష్టిదస్తుష్టిదస్తథా ॥
34. విశ్వపాతా తథా ధైతా సప్తై వైతే తథాగణాః ।
మహాన్మహాత్మా మహితో మహిమావాన్మహాబలః ॥
35. గణాః పంచ తథైవైతే పిత్రూణాం పాపనాశనాః ।
సుఖదో ధనదశ్చా ఽ న్యో ధర్మదో ఽ న్యశ్చ భూతిదః ॥
36. పిత్రూణాం కథ్యతే చైతత్తథాగణచతుష్టయమ్ ।
ఏక త్రింశత్ పితృగణా యైర్వ్యాప్త మఖిలం జగత్ ॥
తేమేఽను తృప్తాసుష్యంతు యచ్ఛంతు చ సదాహితమ్ ॥

**షణ్ణవతి శ్రాద్ధ దినములు :** 12 అమావాస్య దినములు, 12 రవి సంక్రమణ దినములు, 14 మన్వాదులు, 16 మహాలయములు, 4 యుగాదులు, 13 వ్యతీపాత దినములు, 13 వైధృతి దినములు, 12 త్రిస్రోష్టక దినములు మొత్తం ఈ తొంభై ఆరు దినములను షణ్ణపతి శ్రాద్ధ దినములు అంటారు. వీటిలో శుభకార్యములు చేయరాదు. పితృదేవతలకు ప్రీతికరమైనవి షణ్ణవతి శ్రాద్ధ దినములు.

శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

# శ్రీ శార్వరి నామ సంవత్సర పంచాంగం నిర్ణయ పీఠిక

**శ్లో॥ అంతరాయ తిమిరోపశాన్తయే శాంతపావన మచిన్త్యవైభవం ।**
**తం నరం వపుషి కుంజరం ముఖే మన్మహే కిమపి తుందిలం మహః ॥**

**శ్లో॥ శ్రీ కళ్యాణ గుణావహం రిపుహరం దుస్స్వప్న దోషాపహం**
**గంగాస్నాన విశేష పుణ్యఫలదం గోదాన తుల్యం నృణాం ॥**
**ఆయుర్వృద్ధి దముత్తమం శుభకరం సంతాన సంపత్ప్రదం**
**నానాకర్మ సుసాధనం సముచితం పంచాంగమాకర్ణ్యతామ్**

సృష్ట్యాది గత సౌరాబ్దాః .......................... 1,95,58,85,121
(1,95,58,83,103 BCE)
వర్తమాన 28వ మహాయుగ గతాబ్దాః ................. 38,97,220
(38,95,202 BCE)
వర్తమాన కలియు గతాబ్దాః .................. 5,121 (3103 BCE)
శ్రీహర్షశకం గతాబ్దాః .......................... 2476 (458 BCE)
విక్రమార్క శక గతాబ్దాః ............................ 2,076 (58 CE)
శాలివాహన శక గతాబ్దాః ......................... 1,942 (78 CE)
శ్రీ అది శంకరాచార్య I గతాబ్దాః (కంచి)..... 2,528 (510 BCE)
శ్రీ అది శంకరాచార్య II గతాబ్దాః (ఆంధ్ర)..... 2,091 (73 BCE)
శ్రీ అదిశంకరాచార్య III గతాబ్దాః (శృంగేరి) .... 1,232 (788 CE)
శ్రీ రామానుజాచార్య గతాబ్దాః ................. 1,003 (1017 CE)
శ్రీ మధ్వాచార్య గతాబ్దాః .......................... 906 (1114 CE)
ప్రభవాది గతాబ్దాః ......................................... 33 (1987 CE)
ఆంగ్ల సంవత్సరము ................................ 2020–21 CE

**గమనిక :** మనకి చరిత్ర ప్రకారం శంకరులు ముగ్గురు ఉన్నారు. ప్రథమంగా ఆది శంకరాచార్యులవారు. ఆయననే ఆది శంకరాచార్య–I గ పైన సూచించాను. ఈయన కంచికి ప్రథమ పీఠాధిపతి. కంచి లో ఈయన దగ్గర నుండే గురుపరంపరా ఉంటుంది.. రెండొవ వారు ఆంధ్ర దేశంలో ధర్మ ప్రచారం చేసిన శంకరాచార్య–II. అందుకే ఆంధ్ర దేశం లో ఉన్న చాలా పంచాంగాలలో ఈయన గతాబ్దాలే ఇప్పటికీ వ్రాస్తున్నారు. ఆయనకి పీఠం ఉన్నట్టు ఆధారం లేదు. మూడవ వారు శృంగేరి స్థాపించిన శంకరాచార్య–III. అందుకే శృంగేరి గురు పరంపరా ఈయన కాలం నుండి ఉంటుంది.

# శ్రీ శార్వరి నామ సంవత్సర పీఠికా సంవత్సర ఫలమ్

అథాస్మిన్ దేశే లోక వ్యవహారార్థం చాంద్రమానాబ్దో గ్రాహ్యః । వింధ్యస్య ఉత్తరదేశే బార్హస్పత్యమానాబ్దో గ్రాహ్యః । అయమేవ ఫలప్రదర్శనార్థం మాస నామ్నాగ్రాహ్యః । చాంద్రమాన వశాదయం శ్రీ శార్వరీ నామ సంవత్సరః ॥ బార్హస్పత్యమాన వశాదయం "ప్రమాదీచ" నామ సంవత్సరః । గురుదయావశాత్ మాసనామ వశాదయం 'ఆషాఢాబ్దః' ఇత్యుచ్యతే ॥ "యుగంభవేద్వత్సర పంచకేన యుగానితు ద్వాదశ వర్ష షష్ట్యాం" ఇతి శ్రీపత్యాద్యుక్తేః ప్రభవాది క్షయాన్తేషు షష్ఠి సంవత్సరేషు పంచవత్సరాత్మకాని ద్వాదశయుగాని భవన్తి" । తత్ర పితృదేవతాకంసప్తమం మహాయుగం । అస్మిన్యుగే 1) సంవత్సర 2) పరివత్సర 3) ఇదావత్సర 4) అనువత్సర 5) ఇద్వత్సరాణాం మధే తత్ర దేవతాకః అనువత్సరః నామకః తృతీయః శ్రీ శార్వరీ నామ సంవత్సరః అస్మిన్యుగే ధాన్యదానం మహాఫలమ్ । అతఏవ "విష్ణుధర్మోత్తరే" ప్రజాపతిం ధాన్యానాం అనుపూర్వకే

| | | | |
|---|---|---|---|
| రా | శు | ర చం బు | |
| లగ్నం | వర్షలగ్నం కర్కాటక లగ్నం | | కు శ |
| | | | కే గు |

| | | | |
|---|---|---|---|
| శు రా | | | ర బు |
| | జగల్లగ్నం వృశ్చిక లగ్నం | | శ కు గు |
| | | | కే చం లగ్నం |

## శార్వరి వత్సర ఫలములు

**మేదినీశుష్యతే సర్వా ధనధాన్య ప్రపీడనం । శార్వర్యాం వర్షతే క్వాపి పీడ్యంతే మానవాభువి ॥**
**శార్వరీ వత్సరే సర్వసస్యవృద్ధి రనుత్తమా రాజానో విలయంయాంతి పరస్పర జయేచ్ఛయా ॥**

ప్రపంచమందంతటను ధనధాన్యముల కొరత యేర్పడును. అకాలవర్షములును, రోగ పీడలుండును. రాజులు పరస్పర జయాభిలాషులై కలహించుచుందురు. ప్రజాహాని యుండును.

**శార్వరి వత్సరాధిపతి కుజుడు :** అల్పవృష్టి, ప్రజాక్షయము, రాజకీయ వడిదుడుకులు, చైత్రాదిమూస త్రయమున ఆహార ధాన్యముల ధరలు సరసము, ఆషాఢాది ద్వయమున అధిక వర్షములు, భాద్రపదమున వర్షావరోధములు, రాజకీయ కల్లోలములు, ప్రజాక్షోభము, ఆశ్వయుజమున రోగములు, పశ్చిమదేశములందు దుర్భిక్షము, తూర్పుదేశములందు సుభిక్షము, కార్తికాది మాసద్వయమున ఆహారధాన్యముల ధరలు పెరుగును. పౌషాదిమాసత్రయమున ఆహారధాన్యముల ధరలు సరసమగును.

## ఆషాఢాబ్దఫలము : గురూదయవశాత్

**ఆషాఢే జాయంతే సస్యాని క్వచిద వృష్టి రన్యత్ర ।**
**యోగక్షేమం మధ్యం వ్యగ్రాశ్చ భవంతి భూపాలకాః ॥.**

గురూదయం ప్రకారం ఆషాఢాబ్దంగా నిర్ణయింపబడిది. సస్యములు అక్కడక్కడా బాగా పండును. వర్షములు మధ్యస్థముగా ఉండును. రాజులు ప్రజలయొక్క క్షేమము, యోగము సాధారణస్థాయిలో గమనిస్తూ పరిపాలన చేయుదురు.

## ప్రమాదీచ సంవత్సర ఫలములు (బార్హస్పత్యమానవశాత్)

**శ్లో॥ సస్యానామీతిభయం క్షుద్భయ మఖిల ప్రజానాం చ**
**చోరభయం ధనికానాం రాజభయం చ ప్రమాద్యబే ॥**

సస్యములకు తెగుళ్ళు పట్టును. ఈతి భయం, ఆకలిబాధలుండును. ధనికులకు చోరబాధలుండును. రాజకీయ వడి దుడుకులుండును. కల్లోలములు ప్రజాక్షోభముండును.

అస్య సమస్త కల్యాణ భాజనస్య శ్రౌతస్మార్త కర్మానుష్ఠాన క్రియాతంత్ర వ్యవహారహేతు భూతస్య బ్రాహ్మణో జన్మతః ఫలా యశ్చణోతిశ్చ క్రతుఫలం ప్రాప్నువంతి నసంశయః । బ్రహ్మాయుః ప్రమాణమన్వింద్ర సప్తర్షి ప్రమాణ వర్ష వర్షాధిపాతి ఫలతత్తద్గ్రహ చారః గ్రహసమాగమ, ఉదయా స్తమయ వక్రవక్ర త్యాగ స్ఫుటపాత ద్విర్భవపాతి యధాకాల సంభవ శ్రీ లక్ష్మీనారాయణ యోగ సహితం సాంగం పంచాంగం శ్రీ సూర్య ఆర్యభట్టు సిద్ధాన్తోక్త మార్గేణమయా లిఖ్యతే గోదావరీ తీరస్థిత శ్రీ రాజ మహేంద్ర నగర్యాం ద్వాదశాంగుళ శంఖుజనితం యల్లం కోజయన్యుపరి కురుక్షేత్రాది స్పృశత్సూత్రం మేరుగతైర్ని గదితా సాభూమధ్య రేఖతః ప్రాగధ్వ యోజనాని ప్రభవాది గతాబ్దాః 33 ఏతత్ అనంతరం వర్తమానస్య శార్వరి సంవత్సరస్య శ్రీశైలాది మహేంద్రగిరి మధ్యస్థ త్రిలింగ దేశస్య రాజాధి నిర్ణయం.

# నవ నాయకులు

**రాజు - బుధుడు : బుధేబ్దనాథేత్వ పరంచసస్యం శ్రేష్ఠంచ వృద్ధిర్లిపి లేఖభానాం**
**ప్రభూతవాతూర్భువి మధ్య వృష్టిః గదాహతః ప్రోద్ధత రాజకపః**

బుధుడు రాజు అయిన సంవత్సరం అపరసస్యములు బాగుగా ఫలిస్తాయి. పూర్వ సస్యములు మందఫలమును యిచ్చును. లిపి లేఖకులకు శిల్పకారులకు వృద్ధి ఉండును. వాయుపీడ అధికమై స్వల్పవృష్టి ఉండును. రాజకీయ ఒడిదుడుకులు అధికము రోగపీడలు వుండును. యింకా విశేషం ఏమనగా విజ్ఞాన వినోద విషయాలకు సంబంధించిన అంశములు ఖర్చులు పెరుగును. పాడి పరిరశమ ఉత్పత్తులు ధరలు పెరుగుతాయి.

# రాజవాహన ఫలములు

**శ్లో॥ యస్యాబ్దే వాహనం డోలా హాహాభూతాచ మేదినీ**
**దుర్భిక్షం సర్వదేశేషు సంగ్రామమం ఖండ ఖండయోః ॥**

రాజు యొక్క వాహనము ఉయ్యెలగానున్న సంవత్సరమున ప్రజాక్షోభ మధికము. ప్రపంచమ దంతటను హాహాకారములు ప్రబలమగును. ప్రపంచమందంతటను దుర్భిక్షముండును. ఆహార ధాన్యముల కొఱత, ధాన్యాదుల ధరలు విపరీతముగా పెరుగుట యుండును. కంట్రోలు పరిస్థితులవల్ల కొంత స్వాస్థ్యమేర్పడును. ప్రపంచయుద్ధము సంభవించును. ప్రతి ఖండమునందు యుద్ధము ముమ్మరముగా జరుగుచుండును.

**మంత్రి - చంద్రుడు :** **సోమే ప్రధానాభ్యుదయం వ్రజంతి ప్రజ్ఞామహీశా బహుధా చ వృష్టిః**
**శాలీక్షు గోధుమ గవాం వివృద్ధిః యజ్ఞక్రియాయాం నిరతా ద్విజాసునిః**

చంద్రుడు మంత్రి అయిన ఎడల ప్రజాభ్యుదయము, రాజకీయా భ్యుదయము, రాజులకు అభివృద్ధి సువృష్టి వుండును. పంటలు బాగుగా ఫలించును. ఆహార ధాన్యముల కొరత తీరును. పశువులకు ధర పెరుగును. పాడి పంటల సంవృద్ధి బాగుంటుంది. నూనె, నెయ్యి, పంచదార, వెండి, బంగారం ధరలు హెచ్చు స్థాయిలో నిలబడిపోవును.

**సేనాధిపతి-రవి:** అన్యోన్యయుద్ధం దరణీశ్వరాణామల్పాంబుధా వారిధరాస్యమంతాత్ ।
రక్తాని సస్యాని ఫలన్తిభూయో సైన్యాధిపత్యే దివసేశ్వరస్య ॥

సేనాధిపతి రవి అయిన సంవత్సరం రాజులు పరస్పరం కలహించుకుందురు. యుద్ధమందు ఆసక్తి గలవారై ఉందురు. మేఘములు స్వల్పముగా వర్షించును. ఎర్రని సస్యములు బాగుగా ఫలించును.

**సస్యాధిపతి - గురుడు:** **యవగోధూమచణకాః ఫలితా సఖ్యర్మహీతలే**
**పీతధాత్రీ సుఫలితా గురౌ సస్యాధిపేసతి**

పూర్వ సస్యాధిపతి గురుడగుటచే పచ్చని భూములు, పచ్చని ధాన్యము బాగుగా ఫలించును. యవలు, గోధుమలు, శనగలు, పచ్చ జొన్నలు, పెసలు, ఉలవలు బాగుగా ఫలించును. పత్తి చర్మము, వెండి, బంగారము, వేరుశనగపప్పు, తగరం, రబ్బరు బ్యాంకు, వ్యాపారషేర్‌లు, వస్త్రముల ధరలు తగ్గును.

**ధాన్యాధిపతి - కుజుడు :** **ఫలాని శూకధాన్యాని రక్తధాన్యాని యానిచ ।**
**రక్తభూమిస్సుఫలితా భౌమే ధాన్యాధిపేసతి ॥**

కుజుడు అపర దాన్యాధిపతి అగుటచే మధ్యమ వర్షము కురియును. గోధుమలు, సజ్జలు వంటి ధాన్యములు బాగుగా ఫలించును. ఎర్రని ధాన్యములు అనుకూలముగా ఉండును. ఎర్రటి భూమి చక్కగా ఫలించును.

**అర్ఘాధిపతి-రవి:** అనర్ఘశ్చాల్పవృష్టిశ్చ ప్రజానాంక్షుద్భయం తథా ।
రాజ్ఞా పరస్పర క్రోధస్సూర్యేర్ఘాధిపతౌ యది ॥

అర్ఘాధిపతి రవి అగుటచే సువృష్టి, సస్యాభివృద్ధి కలుగును. అర్ఘ వృద్ధి అధికమగును. ప్రజలకు ఆహారధాన్యములు సరియగు కాలములో అందక ఆకలి

బాధలు పెరుగును. రాజులు కోపావేశములతో ఉందురు. ప్రజలు ప్రజాపాలన మూలంగా అసంతృప్తికి లోనగుదురు. రాజులకు పరస్పర యుద్ధములు పెరుగును.

**మేఘాధిపతి - రవి :** మహర్భయం ఫలం స్వల్పం వర్షం స్యాత్ఖండ మండలే ।
రక్తసస్యం సుఫలితం సూర్యే మేఘాధిపే సతి ॥

ప్రజలు అధికకాలము భయభ్రాంతులు అవుతారు. పంటలు స్వల్పముగా ఫలించును. కొన్ని కొన్ని ప్రాంతాలలో ఖండ వృష్టి కురియగలదు. ఎర్రని భూములు బాగుగా ఫలిస్తాయి.

**రసాధిపతి - శని :** తిలమాషకుళత్థాది కృష్ణధాన్యాని యానిచ
కృష్ణ భూమిశ్చ ఫలితామందేసతి రసాధిపే

నువ్వులు, మినుములు, ఉలవలు, మొదలగు నల్ల ధాన్యములును, నల్లని భూమియు ఫలించును.

**నీరసాధిపతి - గురుడు :** పూగీఫలాన్నఖిలరత్న సువర్ణ ధాన్య
కార్పాసచర్మ కుసుమానిచ చందనంచ
వృద్ధింయయుర్ద్విజగణాస్సుఖినోభవంతి
భూమోచ నీరసపతౌ సురరాజపూజ్యే

వక్కలు సమస్తమణులు, రత్నములు, బంగారం, వెండి, ధాన్యము, సత్తి చర్మములు, పూలు, సుగంధ వస్తువులు, చందనము మొదలగునవి ఉత్పత్తి పెరిగి ధరలు తగ్గును. బ్రహ్మవాదులు, బ్రాహ్మణులు సుఖించెదరు.

## ఉపనాయక నిర్ణయం

| | | |
|---|---|---|
| పురోహితుడు గురువు | పశుఅధిపతి రవి | మృగాధిపతి రవి |
| పరీక్షకుడు బుధుడు | దేవతలకధిపతి గురుడు | శుభాధిపతి బుధుడు |
| గ్రామపాలకుడు చంద్రుడు | నరాధిపతి రవి | స్త్రీణామధిపతి రవి |
| గణకుడు శుక్రుడు | గ్రామనాయకుడు బుధుడు | కోశాధిపతి గురుడు |
| దైవజ్ఞుడు రవి | వస్త్రాధిపతి శని | యుద్ధాధిపతి చంద్రుడు |
| రాష్ట్రాధిపతి బుధుడు | రత్నాధిపతి చంద్రుడు | ఛత్రాదిపతి గురుడు |
| దేశాధిపతి గురువు | వృక్షాధిపతి కుజుడు | మేకలు, గొర్రెలకు అధిపతి చంద్రుడు |
| అశ్వాధిపతి చంద్రుడు | జంగమాధిపతి గురువు | వ్యవహారాధిపతి గురుడు |
| గజాధిపతి గురుడు | సర్పాధిపతి శుక్రుడు | వ్యాపారాధిపతి చంద్రుడు |
| | | తటాకాధిపతి శుక్రుడు |

**ఫలితం :** శుభగ్రహ ఆధిపత్యం వచ్చిన భావములు రక్షణ కలిగి ఉంటాయి. పాపగ్రహ ఆధిపత్యం ఉన్న భావములు ఇబ్బందికరంగా ఉంటాయి. నవ నాయకులు 4శుభాధిపత్యములు, 5 పాపాధిపత్యములు వచ్చినవి. కావున రాబోవు శార్వరి నామ సంవత్సరం ఫలితాంశములు సానుకూలముగా ఉందుటకు అవకాశములు ఉన్నవి.

# మేష సంక్రమణ ఫలము

దీ.13-04-2020, రా.08:24, స్వస్తిశ్రీ చంద్రమాన శ్రీ శార్వరి నామ సంవత్సరం చైత్ర బహుళ షష్ఠి వెళ్ళగా సప్తమి సోమవారం పూర్వాషాఢనక్షత్రం ధనూరాశి వృశ్చికలగ్నం. ◆ లగ్నానికి శుక్రవీక్షణ లగ్నాధిపతి కుజుడు ఉచ్ఛస్థితి ధనకారకుడు నీచస్థితి. ధనస్థానమునకు రాహు కేతు సంయోగం. ఈ ధన విషయంలోనే చంద్రునికి రాహుకేతు సంయోగం. రాష్ట్రంలో ఆర్థిక లావాదేవీలు మినహా మిగిలిన అన్ని అంశాలకు మంచి ఫలితాంశములు సూచిస్తున్నాయి. సోమవారం మేష సంక్రమణం ప్రభావంగా భూమియందు పంటలు బాగా పండును. ఆకాశము మేఘములే నిండి యుండును. పల్లెలు సుఖవంతమగును. **"రాత్రౌ సస్యాభివృద్ధిస్స్యాత్ క్షేమమారోగ్యం సుభిక్ష కృత్"** సస్యాభివృద్ధి క్షేమము, ఆరోగ్యము, సంపదలు కలుగును. సప్తమి తిథి కాలంలో ప్రవేశము రాజయుద్ధమునకు అవకాశము. గ్రహచారము అంతా ప్రవేశ సమయ విషయమై అనుకూల స్థితినే సూచిస్తున్నాయి. రోహిణీ నక్షత్ర స్థితి సంధి యందు వున్నది. **"సంధి సంస్థం యదా బ్రాహ్మభం జాయతే ఖండ వృష్టి స్తదా సర్వధాన్యాప్రయః"** ఖండవృష్టి కలుగును. ధాన్యాదులు నిల్వ చేయుట ద్వారా ధరలు పెరుగును. పాడిపంటల కొరత ఏర్పడును.

# రవి ఆర్ద్ర నక్షత్ర ప్రవేశ ఫలము

దీ.21-6-2020 రా.గం.11:29లకు రవి ఆర్ద్రా ప్రవేశము. సూ.ఉ.5:32 సూ.అ.6:37. దినం 32:42. స్వస్తిశ్రీ శ్రీ శార్వరి నామ సంవత్సరం జ్యేష్ఠ బహుళ అమావాస్య ఆదివారం వెళ్ళగా ఆషాఢ శుద్ధ పాడ్యమి ఆర్ద్రా నక్షత్ర వృద్ధి యోగం, బవ కరణం, మిథునరాశి, కుంభ లగ్నం సమయంలో రవి ఆర్ద్రా నక్షత్రంలో ప్రవేశము. ◆ రాత్రికాలేజగతోవిపత్తి : రాత్రికాలములో రవి ఆర్ద్రా ప్రవేశ ఫలితము. జగత్తుకు విపత్తు కలుగును. నిర్జల రాశి వున్న సమయంలో రవి ఆర్ద్రా నక్షత్ర ప్రవేశము. గురు శని వక్రించి లగ్నాన్ని చూస్తున్నారు. "ప్రతిపద్యది చార్ద్రాయాః ప్రవేశే శుభదారవేః" పాడ్యమి సమయంలో ప్రవేశము శుభము. "శశిధర వారే స్మరహరధిష్ణే దినకరవే సతి సుభిక్షమ్" ఆదివార ప్రవేశ ఫలితము సుభిక్షము, సస్యవృద్ధి పాడిపంటల సమృద్ధి ధరలు తగ్గటం వంటి ఫలితాలు వుంటాయి. చంద్రుడు ఆర్ద్రా నక్షత్రంలో వుండగా రవి ఆర్ద్ర ప్రవేశ ఫలితం సస్యవృద్ధి. అయితే అగ్ని వలన, దుర్మార్గుల వలన, చోరుల వలన భయము కలుగును. వృద్ధి యోగము రోజున రవి ఆర్ద్రా ప్రవేశము సస్యవృద్ధి. కర్కాటక లగ్న ప్రభావము సస్యవృద్ధి. భరణ్యాది చతుష్క మండలంలో రెండవ మండలంలో చంద్రుడు వుండగా రవి ఆర్ద్రా ప్రవేశ ఫలితం అతివృష్టి కలుగును. రాబోవు కార్తెలు అన్నీ పూర్ణజల సంబంధమే.కావున వర్షాకాలం మంచివర్షములకు అవకాశం ఉన్నది.

# పశుపాలక నిర్ణయం

రవి బుధుడు అయిన కారణంగా బలభద్రుడు పశుపాలకుడు అగును. రవి సంచార ఆధారంగా నిర్ణయం చేయు విషయంలో గోష్ఠాగార ప్రాపకుడు యముడు, గోష్ఠబహిష్కర్త యముడు అయి ఉన్నాడు.

**బలరాముడు పశుపాలకుడు అయిన ఎడల :**

**సువృష్టి స్సర్వేదేశేషు సర్వసస్య సమృద్ధయః**
**మధ్యదేశే సుభిక్షంస్యా ద్రామేతు పశునాయకే**

దేశమంతటను సస్యానుకూల వర్షములు కలుగును. పంటలు బాగా పండును. మత్స్యదేశమునందు విశేషముగా సుభిక్షము పాడిపంటల సమృద్ధి కలుగును.

**గోష్ఠాగార ప్రాపకుడు, గోష్ఠ బహిష్కర్త యముడు :**

**అనర్ఘశ్చాల్ప వృష్టిశ్చ । స్వల్పక్షీరం గవాం తథా ।**
**పశుపీడాభవేన్నిత్యం । యమేతు పశునాయకే ॥**

పశువులను, కోష్టమునకు తీసుకొచ్చేవాడు, కోష్టమునుండి బయటకు తీసుకెళ్ళేవాడు ఈ రెండు ఆధిపత్యములు యముడికే వచ్చిన కారణంగా ఈ సంవత్సరం నిత్యావసర వస్తువుల యొక్క లభ్యత దుర్లభం అవుతున్నది. అల్పవృష్టి స్వల్పంగా పశువులు పాలిచ్చుట, పశువులకు అనారోగ్యములు ఉంటాయి. తరచుగా పాడిపరిశ్రమలో ఉన్నవారు ఇబ్బందులకు గురయ్యే అవకాశాలు గోచరిస్తూ ఉన్నాయి.

# అఢకాది నిర్ణయం

ఈ సంవత్సరం శని ఉత్తరాషాఢ నక్షత్రములో 2021 జనవరి వరకును, తదాది శ్రవణం నక్షత్రంలో సంచారం చేస్తారు. ఉత్తరాషాఢలో సంచారం చేయుకాలంలో బాలగొల్లవాని చేతియందును, తదాది యవ్వన గొల్లవాని చేతియందును వుండును. “అఢకో గోప హస్తేతు సుభిక్షా రోగ్య సంపదః” అందువలన ఈ సంవత్సరం అఢకం గొల్లవానియందు ఉన్న కారణంగా సుభిక్ష క్షేమ ఆరోగ్యములు, పాడిపంటల సమృద్ధి, ధాన్యాదులు సరసమయిన ధరలతో వుండడం జరుగుతుంది. ఇక మేఘ నిర్ణయ విషయంలో శాలిశకం 1942 “సంవర్త నామ మేఘము” చతుర్మేఘ పక్షమాన ఆవర్తనామ మేఘము – సంవర్త నామ మేఘము మేరువుకు ఉత్తరదిశలో పుట్టును. “వాయుపూరిత తోయంచ వర్షణం సర్వదిక్షుచ – లవణార్ణవ పర్యంతం సంవర్తాభ్రస్య లక్షణం” గాలితో కూడిన వర్షములు సర్వదిక్కులయందు వుండును. తూర్పుతీర ప్రాంతం వారికి తుఫాను గాలి దెబ్బ ఉంటుంది. అఢక ప్రమాణం తెలుపుతూ “విస్తారం సప్తతిశ్చైవ శతయోజనమున్నతం” అని చెప్పారు. అష్టభాగాస్సముద్రేషు పర్వతేషు తథానవ

– త్రయోభాగా భువిప్రోక్తా స్త్వేవం వర్షతిచత్రిథా – ఎనిమిదిభాగములు సముద్రంలో పర్వతముల మీద తొమ్మిది భాగములు – మూడు భాగములు భూమిమీద కురియును. వాయునామక వాయువు వర్ష ప్రతిబంధకములు సూచించును. సౌదామినీ విద్యుత్ సువృష్టి సూచకము. స్థలిత గర్భితం సువృష్టిసూచన. క్షారసముద్రం వాయుసహిత సువృష్టి. అనంతనామ భూవాహక శేషు. రాజులు, ప్రజలు, సుఖించెదరు. కలివత్సరాలు–5121 సావన వర్షాధిపతి రవి – గొప్పవృష్టి యోగము వున్నది.

## కర్తరీ నిర్ణయము

* దీ.04–05–2020 ఉ.08:58లకు స్వస్తిశ్రీ చాంద్రమాన శ్రీ శార్వరి నామ సంవత్సరం వైశాఖ శుద్ధ ద్వాదశీ సోమవారం డొల్లకర్తరీ ప్రారంభం అవుతుంది.
* దీ.11–05–2020 ఉ.6:24లకు స్వస్తిశ్రీ చాంద్రమాన శ్రీ శార్వరి నామ సంవత్సరం వైశాఖ బహుళ చవితి సోమవారం పెద్దకర్తరీ ప్రారంభం అవుతుంది.
* దీ.28–05–2020 ప.1:53 లకు స్వస్తిశ్రీ చాంద్రమాన శ్రీ శార్వరీ నామ సంవత్సరం జ్యేష్ఠ శుద్ధ షష్ఠి గురువారం కర్తరీ త్యాగం అవుతుంది.
* ◆ "మృద్దారు శిలాగృహకర్మాణివర్జయేత్" అని కర్తరీ గురించి చెప్పబడిన కారణంగా వాస్తు కర్తరీ అనిపించబడు ఈ కర్తరీలో కర్ర, మట్టి, రాయి ఉపయోగించి చేయు గృహ నిర్మాణాలు ఆరంభించుటకు మంచికాలము కాదు. కర్తరీలో శంఖుస్థాపన, ద్వారా ఎత్తులు మరియు పాక, షెడ్, పెంకుటిల్లుకు పై కప్పు వేయుట శ్రేయస్కరం కాదు.
* ◆ కర్తరీ విషయంలో వాస్తు విషయంగా మాత్రమే ప్రాధాన్యం యివ్వాలి. ఇతర కార్యములు కూడదనే ప్రమాణాలు కొన్ని గ్రంథాలలో వున్ననూ వాటి ఖండనలు అదే గ్రంథాల నుండి వున్నాయి. అందువలన కర్తరీ అనునది వాస్తు విషయాలకు మాత్రమే.

## శుక్ర మౌఢ్యమి నిర్ణయం

**శుక్ర మూఢమి : (30–05–2020 నుండి 9–06–2020 వరకు)** దీ.30–05–2020 శ్రీ శార్వరి నామసంవత్సరం జ్యేష్ఠ శుద్ధ అష్టమి శనివారం రోజున శుక్రుడు రవి నుండి పశ్చాదస్తం పొందడం వలన (పశ్చిమ దిశలో అస్తమించడం వలన) మూఢమి ప్రారంభం అయి దీ.9–06–2020 శ్రీ శార్వరి నామ సంవత్సరం జ్యేష్ఠ బహుళ చవితి మంగళవారం రోజున శుక్రుడు రవి నుండి ప్రాగుదయం జరగడం (తూర్పుదిశలో ఉదయించడం వలన) మూఢమి త్యాగము అగును.

**శుక్ర మూఢమి : (14–02–2021 నుండి 30–04–2021 వరకు)** దీ.14–02–2021 శ్రీ శార్వరి నామసంవత్సరం మాఘ శుద్ధ తదియ ఆదివారం రోజున శుక్రుడు రవి నుండి ప్రాగస్తం పొందడం వలన (తూర్పు దిశలో అస్తమించడం వలన) మూఢమి ప్రారంభం అయి దీ.30–04–2021 స్వస్తిశ్రీ ప్లవ నామ సంవత్సరం చైత్ర బహుళ చవితి శుక్రవారం రోజు పశ్చాదుదయ శుక్రుడు అయిన కారణంగా మూఢమి త్యాగము అగును.

# గురు మౌఢ్యమి నిర్ణయం

**గురు మూఢమి: (16-1-2021 నుండి 13-02-2021 వరకు)** ది.16-1-2021 శ్రీ శార్వరి నామసంవత్సరం పుష్య శుద్ధ తదియ శనివారం రోజు గురువు రవి నుండి పశ్చాదస్తం పొందడం వలన (పశ్చిమదిశగా అస్తమించడం వలన) గురుమూఢమి ప్రారంభం అయి ది.13-02-2021 శ్రీ శార్వరినామ సంవత్సరం మాఘశుద్ధ విదియ శనివారం రోజు గురువు ప్రాగుదయం పొందడం వలన (తూర్పు దిశలో ఉదయించడం వలన) గురువు మూఢమి త్యాగం అగును.

# పుష్కర నిర్ణయం

**తుంగభద్రా నదీ పుష్కరములు :** ది.20-11-2020 ప.01:22 ని.లకు శ్రీ శార్వరి నామ సంవత్సరం దక్షిణాయనం శరదృతువు కార్తీకమాసం శుద్ధ షష్ఠీ శుక్రవారం ఉత్తరాషాఢ నక్షత్రం రోజున గురువు ధనూరాశి వదిలి మకర రాశిలో ప్రవేశించును. కావున తుంగభద్రా నదీ పుష్కరాలు ప్రారంభం అవుతాయి.

◆ **ముఖ్యగమనిక :** పితృశ్రాద్ధం చేశాక దేవాలయములకు వెళ్ళరాదు. నేడు పుష్కరాలు వ్యాపారధోరణిని అనుసరిస్తున్నాయి. పితృకార్యం చేసిన రోజు యితర దేవతా ఆరాధనలకు విశేషం లేదు. పితృదేవతలే ప్రతి మనిషి జీవితంలోను ప్రధాన దేవతలు. పుష్కర యాత్రకు వెళ్ళినవారు ముందురోజే దేవాలయ సందర్శనం చేయండి. పితృదేవతా సంబంధంగా కార్యం చేసిన రోజు దేవాలయ దర్శనం కూడదు. (పితృకార్యం అనంతరం). గమనించి సంచరించండి. పుష్కర సందర్భంగా ప్రారంభం నుండి 12 రోజులు పూర్తిగా పుష్కరుడు ఆ పుష్కర నదిమీదే విహరిస్తూ ఉంటారు. కావున 12 రోజులు 24 గంటలూ కూడా విశేషమే. అయినప్పటికీ రాత్రి 2వ యామము, 3వ యామము స్నానానికి నిషేధము. అలాగే కృత్రిమమైన మురికినీరుతో పుష్కరశ్రాద్ధము చేయుట కూడా నిషేధమే. పుష్కరాలు 12 రోజులు అయిన తరువాత ప్రతిరోజూ అపరాహ్ణ కాలంలో ఆ నదిమీదే పుష్కరుడు విహరిస్తాడు. అందువలన ఆ సంవత్సర కాలంలో ఏ రోజైననూ అపరాహ్ణ కాలంలో ఆ పుష్కరనదిని ఉద్దేశించి శుచిగా, శుభ్రమైన జలంతో పుష్కరశ్రాద్ధము నిర్వహించవచ్చు. అది ఈ 12 రోజుల మధ్యలో చేసిన ఫలితాన్నే సూచిస్తుంది.

---

**రామం స్కంధం హనూమంతం వైనతేయం వృకోదరం**
**శయనే యఃపఠే న్నిత్యం దుస్స్వప్నం తస్య నశ్యతి**

ఈ శ్లోకము నిద్రకు ఉపక్రమించే ముందు పఠించిన యెడల దుస్స్వప్నములు రావు.



# చంద్రచారము



జ్యేష్ఠ ప్రతిపద్యుక్త శనివారము ఫలితము జలశోషం ప్రజానాశం ఛత్రభంగోమహీపతేః – కించ – మధ్యసస్యమానర్ఘంచ జ్యేష్ఠాదేశనివాసరే జలము లేక పశువులు, మనుషులు రోగములచే పీడింప బడెదరు. పశువులకు ప్రజలకు, రాజ్యములకు నష్టము కలుగును. దుర్భిక్షము ప్రజాక్షోభం ఉండును. మధ్య స్థాయిగా పంటలు పండుటచే ధరలు ధాన్యాదుల విషయమై పెరుగును. "ఆషాఢే పంచమీ శుక్లా భృగువారో యదాభవేత్ సుభిక్షం క్షేమమారోగ్యం సువృష్టిశ్చభవేద్ధ్రువం" సువృష్టి, సుభిక్షం, క్షేమం, ఆరోగ్యం యివి ఆషాఢ శుద్ధ పంచమీ శుక్రవారం ఫలితములు. ఆషాఢమాసంలో దశమి స్వాతీ కలయిక ప్రభావం "మహాద్వర్షం భవేద్ధ్రువం" అధిక వర్షములు కురియును. ఆషాఢంలో రోహిణీ ఏకాదశీ కలయిక పంటలు మధ్యస్థంగా ఉండును. పుష్య అమావాస్య గురువారం సస్యవృద్ధి కలుగును.

# సూర్య గ్రహణము

◆ ది.21-06-2020 శ్రీ శార్వరి నామ సంవత్సరం ఉత్తరాయణం గ్రీష్మఋతువు, జ్యేష్ఠ అమావాస్య, ఆదివారం మృగశిరా నక్షత్రం, మిధున రాశి యందు రాహుగ్రస్త చూడామణి నామ సూర్య గ్రహణం. **స్పర్శకాలం** ఉ.10-21లకు, **మధ్యకాలం** ప.12:03, **మోక్షకాలం** ప.1:49. సూర్యోదయ కాలం నుండి గ్రహణం పూర్తి అయ్యే వరకు భోజనాదులు నిషేదం. ప్రత్యాబ్దీకములకు గ్రహణానంతరమే కాలము చెప్పబడినది. ◆ దేవాలయములు సూర్యోదయ కాలంలో ప్రాతఃకాల పూజచేసి మూసివేయవలెను. యితరులు గోత్ర ప్రవరలతో దేవాలయ పూజ ఈరోజు నిషేధము. గ్రహణానంతరం దేవాలయం సంప్రోక్షణం చేసి సూర్యాస్తమానంతరం భక్తులకు దర్శనార్థం తెరువవలెను. ◆ మిథున రాశివారు శాంతి చేయించుకోవలెను. ప్రధానంగా మృగశిరా నక్షత్రము వారు. మిగిలిన నక్షత్రములు రాశులను గురించి తెలుసుకోగోరువారు మీ గురువులను సంప్రదించండి. ◆ గ్రహణ సమయంలో ఇంటిలో అన్ని వస్తువుల మీద దర్భలువుంచడం మన భారతీయ సంస్కృతి. గ్రహణ ఆరంభంలో స్నానం చేసి అందరూ కూడా మీ యిష్ట దైవాన్ని స్మరిస్తూ గ్రహణకాలం అంతా కాలక్షేపం చేసి, గ్రహణా నంతరం స్నానం చేసి – గృహము, దేవతామందిరము శుద్ధి చేసుకోవలెను.

# గ్రహణ శాంతి

**దానం :** వెండిసూర్యబింబం, నాగపడగ, బియ్యం, గోధుమలు, ఎరుపువస్త్రం, కెంపు, రాగిపాత్ర (కంచు), నువ్వులు, ఆవునెయ్యి, దక్షిణ దానం యివ్వవలెను. గ్రహణం రోజు, మరుసటిరోజు లేదా మరల అమావాస్య లోపు దానం యియ్యవచ్చును. సువర్ణముతో సూర్యబింబము మాదిరిగా (బొట్టుబిళ్ళ మాదిరి)

చేయించి దానం చేయవలెను. **దాన సంకల్పం :** మమజన్మరాశి జన్మనక్షత్రవశాద్యరిష్ట స్థానస్థిత గ్రహణ సూచిత సర్వారిష్ట ప్రశాంతి పూర్వక ఏకాదశ స్థాన స్థితగ్రహణ సూచిత శుభఫలప్రాప్త్యర్థం బింబదానం కరిష్యే"

**దాత చదవవలసిన శ్లోకం :** తమోమయమహాభీమ సోమసూర్య విమర్దన హేమతారాప్రదానేన మమ శాంతిప్రదోభవ విధుంతుద నమస్తుభ్యం సింహికా నందనాచ్యుత దానేనానేన నాగస్య రక్షమాం వేధజాద్భయాత్.... ఎటువంటి దానం ఎప్పుడు యిచ్చినా దానంతో పాటుగా "స్వయంపాకం" యివ్వడం శుభము. గ్రహజపం వంటివి చేయించినాసరే యివ్వండి.

◆ గ్రహణశాంతి అనేది మహర్షులు గ్రంథస్థంగా చెప్పిన అంశము. దీనికి వైదీకాచారము జోడించి పెద్దలు చెప్పే విషయాలను మనం యిక్కడ ప్రస్తావన చేశాము. సూర్యచంద్రులను ప్రత్యక్ష దైవాలుగా భావన చేసి మనం నిత్యం దైవ సంబంధ కార్యములు చేస్తూ ఉంటాము. వారిరువురిలో ఏ ఒక్కరైనా ప్రత్యక్షంలో లేరు అంటే గ్రహణంగా భావన చేసి శాంతి పూజ చేయుట మన మతాచారము. ఇది చర్చనీయాంశ విషయము కాదు. అనేది నా భావన. ◆ అందుకోసమే ప్రతి అమావాస్య వెళ్ళిన మరుసటిరోజున, గ్రహణం మరుసటిరోజున, జాతాశౌచ, మృతాశౌచములకు మరుసటిరోజున దేవతామందిరం అంతా కూడా శుభ్రంచేసి మరలా విగ్రహాలను కడిగి శుద్ధి చేసి దేవతామందిరములో పెట్టి అర్చన చేయడం మన సంప్రదాయం.

# ప్రదోష నిర్ణయమ్

"విఘ్నార్కకామారాత్ర్యాదౌ ద్వ్యేకార్ధ ఘటికాః క్రమాత్"

చవితి తిథి సూర్యాస్తమయం తర్వాత 9 ఘడియల లోపల కనుక ఒక అర్ధ ఘడియ కాలం వ్యాపించినను, సప్తమి తిథి సూర్యాస్తమయం నుండి అర్ధరాత్రి లోపల 1 ఘడియ కాలం వ్యాపించి యున్నను, త్రయోదశి తిథి సూర్యాస్తమయం తర్వాత సూర్యోదయం లోపల 2 ఘడియల కాలం వ్యాపించి యున్నను దానిని ప్రదోషము అంటారు. ప్రదోషకాలము అనధ్యయన సమానము. ప్రదోషకాలము అనగా "ప్రదోషస్త్రి ముహూర్తం స్యాద్ర ద్రవ్యాదస్తంగతే సతి" రవి అస్తమించినది మొదలు మూడు ముహూర్తముల కాలము ప్రదోషము.

◆ **సంతానం :** ఏ నక్షత్రంలో జన్మించినప్పటికినీ 11 వ రోజున "మానెలో ముఖం'' చూచిన తరువాత తండ్రి తన బిడ్డను ప్రత్యక్షంగా చూడడం సత్సంప్రదాయం - నేడు కేవలం శాంతి నక్షత్రాల వారు మాత్రమే ఈ కార్యం చేస్తున్నారు. అందరూ ఆచరించడం మంచిది.

# శ్రీ శార్వరి నామ సంవత్సర కార్తి ప్రవేశ ఫలములు

| తేదీ | కార్తి | ప్రవేశ సమయం | ప్రవేశ రాశి | జలతత్వం | లింగభేదం | వాహనం |
|---|---|---|---|---|---|---|
| 31/03 | రేవతి | ఉ. 06:59 | మిధునం | నిర్జల | స్త్రీ-నపుం | నెమలి |
| 13/04 | అశ్వని | రా. 08:24 | ధనస్సు | నిర్జల | పుం-నపుం | ఎలుక |
| 27/04 | భరణి | ప. 12:10 | మిధునం | నిర్జల | స్త్రీ-నపుం | మేక |
| 11/05 | కృత్తిక | ఉ. 06:24 | ధనస్సు | నిర్జల | స్త్రీ-స్త్రీ | అశ్వం |
| 24/05 | రోహిణీ | రా. 02:35 | మిధునం | నిర్జల | పుం-స్త్రీ | కప్ప |
| 07/06 | మృగశిర | రా. 12:30 | ధనస్సు | నిర్జల | నపుం-స్త్రీ | గాడిద |
| 21/06 | ఆర్ధ్ర | రా. 11:29 | మిధునం | నిర్జల | స్త్రీ-స్త్రీ | మూషికం |
| 05/07 | పునర్వసు | రా. 11:05 | మకరం | పూర్ణజల | స్త్రీ-స్త్రీ | నెమలి |
| 19/07 | పుష్యమి | రా. 10:37 | మిధునం | నిర్జల | స్త్రీ-స్త్రీ | అశ్వం |
| 02/08 | ఆశ్రేష | రా. 09:30 | మకరం | పూర్ణజల | స్త్రీ-పుం | మహిష |
| 16/08 | మఘ | సా. 06:36 | కర్కాటకం | పూర్ణజల | స్త్రీ-స్త్రీ | ఏనుగు |
| 30/08 | పుబ్బ | ప. 03:08 | మకరం | పూర్ణజల | స్త్రీ-పుం | కప్ప |
| 13/09 | ఉత్తర | ఉ. 09:04 | కర్కాటకం | పూర్ణజల | పుం-స్త్రీ | నెమలి |
| 26/09 | హస్త | రా. 12:30 | మకరం | పూర్ణజల | పుం-పుం | ఎలుక |
| 10/10 | చిత్త | ప. 01:36 | కర్కాటకం | పూర్ణజల | స్త్రీ-స్త్రీ | మేక |
| 23/10 | స్వాతీ | రా. 12:01 | మకరం | పూర్ణజల | స్త్రీ-పుం | ఏనుగు |
| 06/11 | విశాఖ | ఉ. 08:15 | మిధునం | నిర్జల | స్త్రీ-స్త్రీ | ఎలుక |
| 19/11 | అనురాధ | ప. 02:14 | మకరం | పూర్ణజల | పుం-స్త్రీ | మహిషం |
| 02/12 | జ్యేష్ఠం | సా. 06:35 | మిధునం | నిర్జల | స్త్రీ-స్త్రీ | గాడిద |
| 15/12 | మూల | రా. తె. 9:33 | ధనస్సు | నిర్జల | నపుం-స్త్రీ | అశ్వం |
| 28/12 | పూ. షాఢ | రా. 11:46 | మిధునం | నిర్జల | స్త్రీ-నపుం | మేక |
| 10/01 | ఉ. షాఢ | రా. 01:47 | వృశ్చికం | పాదజల | స్త్రీ-స్త్రీ | గాడిద |
| 23/01 | శ్రవణం | తె. 04:00 | వృషభం | అర్థజల | పుం-పుం | ఎలుక |
| 06/02 | ధనిష్ఠ | ఉ. 07:13 | వృశ్చికం | పాదజల | స్త్రీ-పుం | మేక |
| 19/02 | శతభిషం | ప. 11:38 | వృషభం | అర్థజల | నపుం-స్త్రీ | గాడిద |
| 04/03 | పూ. భాద్ర | సా. 06:01 | వృశ్చికం | పాదజల | పుం-స్త్రీ | ఎలుక |
| 17/03 | ఉ. భాద్ర | రా. 02:23 | మేషం | నిర్జల | పుం-స్త్రీ | మేక |
| 31/03 | రేవతి | ప. 1:16 | తుల | పాదజల | స్త్రీ-స్త్రీ | గజం |

◆ **అనురాధ కార్తె తర్వాత కార్తెలు వ్రాయుట ప్రాచీనంగా అలవాటు లేదు** ◆

**స్త్రీ - స్త్రీ వ్యసనంకుర్యాత్ - స్త్రీ పురుషస్య వృష్టి రుచ్యతే**
**స్త్రీ నపుంసకయోర్వాయుః - పురుషం పురుషస్య దాహకః**

**వాహనఫలం :** ఎలుక, నక్క, మేక, గాడిద వాహనములు ఉన్న కార్తెలలో అల్పవృష్టి. కప్ప, ఎద్దు వాహనముల కార్తెలలో సువృష్టి. నెమలి వాహనంగా ఉన్న కార్తెలో ఖండవృష్టి. గుర్రం, ఏనుగు పర్వత వృష్టి. రెండూ నపుంసక నక్షత్రాలయితే ఖండవృష్టి. పూర్ణజల రాశి ప్రవేశరోజులలో వర్షయోగములు ఉండును. దీనినిబట్టి వర్షయోగములు ఊహించగలరు. పునర్వసు కార్తె నుండి ఈ సంవత్సరం అనురాధ కార్తె వరకు మంచివర్షయోగములు ఉన్నవి.

# మకర సంక్రాంతి పురుష లక్షణమ్

ది. 14-01-2021, ఉ. 8:16లకు (ఘ. 04.08) స్వస్తిశ్రీ చాంద్రమాన శ్రీ శార్వరి నామ సంవత్సరం హేమంత ఋతువు పుష్యమాసం శుక్లపక్ష పాడ్యమి గురువారం శ్రవణానక్షత్రం మకరరాశి మకరలగ్నమునందు (వజ్రనామయోగం బవ కరణం) రవి మకర రాశి ప్రవేశము. అహః ప్రయాణం 27-53. సూ.ఉ. 6:37, సూ.అ. 5:46.

## సంక్రాంతి పురుషుడు - మందాకినీ నామధేయం - సింహవాహనం

పంచమి విజయాన్ని సూచిస్తుంది. గురువార ఫలితం సువృష్టి. ప్రాతఃకాలం 2వ ముహూర్తం సర్వదా శుభం. ఈ సంక్రాంతి పురుషునికి మందాకిని అని పేరు. విప్రాణం అరిష్టం నింబోదక స్నానం రాజ్ఞాం శుభం. యవకాక్షత ధారణం తద్ వస్తు నాశనం. శ్వేతవస్త్రం ఆరోగ్యం. కస్తూరి, గంధలేపనం స్త్రీలకు అరిష్టం. పున్నాగ పుష్పధారణ కీర్తి ప్రతిష్టలకు ఇబ్బంది. మాణిక్యాభరణ ధారణం మణినాశనం. సువర్ణపాత్రయందు భోజనం బంగారము ధరవరలు హెచ్చుతగ్గులు అగును. అన్న, ఆహారం ప్రజలకు రోగభయం. నారికేళ ఫలభక్షణ ప్రజాపీడ. సింహవాహనం మృగనాశనం. ముసలాయుధ ధారణ యుద్ధమునకు అవకాశము ఉన్నది. శ్వేతఛత్ర ధారణ ఆరోగ్యము. వీణాధారణ పిశాచములకు అరిష్టము. పూర్వదిక్కుకు ప్రయాణము. పూర్వదిశలో ఉన్నటువంటి ప్రాంతములకు యిబ్బంది. చిరునవ్వుతో కూడిన చేష్ట ప్రజలకు పీడ. కూర్చుని ఉన్న సందర్భం పంటలకు ఇబ్బంది. మకర సంక్రాంతి శుక్లపక్షములో వచ్చిన కారణంగా ప్రజలకు వ్యాధి భయం, పీడలు అలాగే రాజులకు యుద్ధభయం కలుగును. ప్రాతఃకాలములో శ్రవణా నక్షత్రములో ప్రవేశమైన కారణంగా వ్యాపారులకు, లేబర్‌లకు సయోధ్య ఉండదు.

**సంక్రాంతి పురుషోత్పత్తి కాలే దానం స్వశక్తితః**
**ఫలం కాంస్యాది ధాన్యాది దీయతేదోషనాశనం**

**అష్టకర్ణో విశాలాక్షో లంబభూర్ధీర్ఘనాశికః**
**అష్టబాహుశ్చతుర్వక్త్రః సంక్రాంతి పురుష స్మృతః**
**శతయోజనమౌన్నత్యం విస్తీర్ణం ద్వాదశస్మృతం**
**ఏవం రూపంహి విజ్ఞేయం సంక్రాంతి పురుషాకృతిః**

మకర సంక్రాంతి మాదిరిగానే ప్రతి నెలలోనూ రవి ఒక్కొక్క రాశిలో ప్రవేశిస్తూ ఒక్కొక్క సంక్రమణం జరుగుతుంది. ఈ సంక్రమణం జరిగిన దినములో పగటి కాలమందు ఎటువంటి శుభకార్యములు చేయరాదని ముహూర్త శాస్త్రము తెలియజేయుచున్నది. ప్రతి అమావాస్యకు, సంక్రమణమునకు పితృతర్పణ చేసి దానధర్మాలు చేయుట వలన పితృదేవతా అనుగ్రహము లభించి సర్వకార్య సిద్ధి చేకూరును. పిల్లలకు అభివృద్ధి కలుగును.

# సాయన రవి సంక్రమణాలు

| తేది | సమయం | సాయన రాశి | ఋతువు | మాసం |
|---|---|---|---|---|
| 20/03 | ఉ. 9:10 | మేషం | వసంత | మాధవమాసం |
| 19/04 | రా. 8:06 | వృషభం | గ్రీష్మం | శుక్ర మాసం |
| 20/05 | రా. 7:11 | మిథునం | గ్రీష్మం | శుచి మాసం |
| 20/06 | రా.తె. 3:05 | కర్కాటకం | వర్ష | నాభస మాసం |
| 22/07 | మ. 1:55 | సింహం | వర్ష | నభస్య మాసం |
| 22/08 | రా. 9:01 | కన్య | శరద్ | ఇష మాసం |
| 22/09 | సా. 6:55 | తుల | శరద్ | ఊర్జ మాసం |
| 22/10 | రా.తె. 4:13 | వృశ్చికం | హేమంత | సహ మాసం |
| 21/11 | రా.తె. 2:07 | ధనస్సు | హేమంత | సహస్య మాసం |
| 21/12 | సా. 03:18 | మకరం | శిశిర | తపః మాసం |
| 19/01 | రా.తె. 2:01 | కుంభం | శిశిర | తపస్య మాసం |
| 18/02 | సా. 4:17 | మీనం | వసంత | మధుమాసం |
| 20/03 | మ. 2:48 | మేషం | వసంత | మాధవ మాసం |

# నిరయన రవి సంక్రమణాలు

| తేది | సమయం | నిరయన రాశి ప్రవేశాలు |
|---|---|---|
| 13/04 | రా. 8:04 | మేష సంక్రమణం ప్రవేశాత్ పూర్వతః - విషువత్ |
| 14/05 | సా. 5:18 | వృషభ సంక్రమణం ప్రవేశాత్ పూర్వతః - హరిపద |
| 14/06 | రా. 11:55 | మిథున సంక్రమణం ప్రవేశాత్ పూర్వదినే - షడశీతి |
| 16/07 | ఉ. 10:48 | కర్కాటక సంక్రమణం ప్రవేశాత్ పూర్వతః - దక్షిణాయన |
| 16/08 | సా. 7:12 | సింహ సంక్రమణం ప్రవేశాత్ పూర్వతః - హరిపద |
| 16/09 | సా. 7:09 | కన్య సంక్రమణం ప్రవేశాత్ పూర్వతః - షడశీతి |
| 17/10 | ఉ. 7:07 | తుల సంక్రమణం ప్రవేశాత్ పరతః - విషువత్ |
| 16/11 | ఉ. 6:55 | వృశ్చిక సంక్రమణం ప్రవేశదినే - హరిపద |
| 15/12 | రా. 9:33 | ధనస్సు సంక్రమణం ప్రవేశాత్ పూర్వతః - షడశీతి |
| 14/01 | ఉ. 08:16 | మకర సంక్రమణం ప్రవేశాత్ పరతః - ఉత్తరాయనం |
| 12/02 | రా. 9:14 | కుంభ సంక్రమణం ప్రవేశాత్ పరతః - హరిపద |
| 14/03 | సా. 6:05 | మీన సంక్రమణం ప్రవేశదినే - షడశీతి |

# ఏకవింశతి మహా దోషములు

1.పంచాంగశుద్ధి 2.సంక్రాంతి దోషం 3.పాపార్గళం 4. కునవాంశ 5.కుజాష్టమం 6.భృగుషట్కం 7.కర్తరీ దోషం 8. అష్టమలగ్నం 9.అష్టమ చంద్రుడు 10. 6,8, 12 స్థిత చంద్ర 11.సగ్రహ చంద్ర 12.దుర్ముహూర్తం 13.ఖర్జూరి చక్రం 14. గ్రహణభ దోషం 15. ఉత్పాతభం దోషం 16. క్రూరయుగ్ధిష్ణి 17.అశుభ విద్ధ 18. విషఘటిక 19.లగ్నాస్థ దోషం 20. గండాస్థదోషం 21.వ్యతీపాత వైధృతి

# ఆదాయ వ్యయములు, రాజపూజ్య అవమానములు

| రాశి | ఆదాయం | వ్యయం | రాజపూజ్యం | అవమానం |
|---|---|---|---|---|
| మేషం | 05 | 05 | 03 | 01 |
| వృషభం | 14 | 11 | 06 | 01 |
| మిథునం | 02 | 11 | 02 | 04 |
| కర్కాటకం | 11 | 08 | 05 | 04 |
| సింహం | 14 | 02 | 01 | 07 |
| కన్య | 02 | 11 | 04 | 07 |
| తుల | 14 | 11 | 07 | 07 |
| వృశ్చికం | 05 | 05 | 03 | 03 |
| ధనస్సు | 08 | 11 | 06 | 03 |
| మకరం | 11 | 05 | 02 | 06 |
| కుంభం | 11 | 05 | 05 | 06 |
| మీనం | 08 | 11 | 01 | 02 |

# కందాయ ఫలములు

| అశ్వని | భరణి | కృత్తిక | రోహిణి | మృగశిర | ఆర్ద్ర | పునర్వసు | పుష్యమి | ఆశ్రేష |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 4 | 7 | 2 | 5 | 0 | 3 | 6 | 1 |
| 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 |
| 3 | 0 | 2 | 4 | 1 | 3 | 0 | 2 | 4 |
| మఘ | పుబ్బ | ఉత్తర | హస్త | చిత్త | స్వాతి | విశాఖ | అనురాధ | జ్యేష్ఠ |
| 4 | 7 | 2 | 5 | 0 | 3 | 6 | 1 | 4 |
| 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 |
| 1 | 3 | 0 | 2 | 4 | 1 | 3 | 0 | 2 |
| మూల | పూ.షా. | ఉ.షా. | శ్రవణం | ధని | శత | పూ.భా. | ఉ.భా. | రేవతి |
| 7 | 2 | 5 | 0 | 3 | 6 | 1 | 4 | 7 |
| 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 |
| 4 | 1 | 3 | 0 | 2 | 4 | 1 | 3 | 0 |

"ఆది శూన్యే మహావ్యాధిః, మధ్య శూన్యే మహాభయః, అంత్యశూన్యే మహా హానిః" బేసిసంఖ్య ధనలాభమును, సమ సంఖ్య సమ ఫలమును, శూన్య సంఖ్య శూన్య ఫలమును ఇచ్చును. పై వాటిలో మొదటి అంకె చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ, ఆషాఢ మాసముల ఫలితము, రెండవ అంకె శ్రావణ, భాద్రపద, ఆశ్వయుజ, కార్తీక మాసముల ఫలితము. మూడవ అంకె మార్గశిర, పుష్య, మాఘ, ఫాల్గుణ మాసముల ఫలితము సూచించును.

# శ్రీ శార్వరి నామ సంవత్సర ఇండియా పండుగలు

## చైత్ర మాసం

25/03 ఉగాది
25/03 చంద్రదర్శనం
25/03 తైలాభ్యంగనం
25/03 యాగకాలం
25/03 వసంత నవరాత్ర ప్రారంభం
26/03 ఉమ,శివ,అగ్ని పూజ
27/03 ఉత్తమమన్వాది
27/03 సౌభాగ్యశయన వ్రతం
27/03 సౌభాగ్యగౌరీవ్రతం
27/03 శివడోలోత్సవం
28/03 గణేశ పూజ
29/03 నాగ పంచమి
29/03 శ్వేతవరాహ కల్పం
29/03 శ్రీపంచమి
31/03 సూర్యపూజ
01/04 భవానీయాత్ర
01/04 అశోకరుద్రపూజ
01/04 బుధాష్టమి
02/04 శ్రీరామనవమి
03/04 ధర్మరాజ దశమి
04/04 మతత్రయ ఏకాదశి
04/04 విష్ణుడోలోత్సవం
04/04 రుక్మిణీ పూజ
05/04 వామనద్వాదశీ
06/04 అనంగ పూజ
06/04 దమనోత్సవం
06/04 శైవచతుర్దశీ
07/04 కర్దమక్రీడ
07/04 రౌచ్యమన్వాది
07/04 నోములకు పౌర్ణిమ
08/04 ఇంద్రపూజ
08/04 సర్వదేవానాం దమన పూజ
08/04 యాగకాలం
12/04 మత్స్యజయంతి
13/04 మేష సంక్రమణం
15/04 బుధాష్టమి
21/04 శివసన్నిధిస్నానం
21/04 మాసశివరాత్రి
21/04 కృష్ణాంగారక చతుర్దశీ
22/04 సర్వేషాం అమావాస్య
22/04 అన్వాదానం
22/04 కూర్మకల్పం
23/04 యాగకాలం
23/04 పిండపితృయజ్ఞం

## వైశాఖ మాసం

24/04 చంద్రదర్శనం
24/04 ధర్మఘటాదిదానం
26/04 అక్షతదియ
26/04 ఉదకుంభదానం
26/04 గౌరీపూజ
26/04 త్రేతాయుగాది
26/04 బలరామజయంతి
26/04 త్రిలోచనయాత్ర
26/04 లక్ష్మీనారాయణపూజ
27/04 నాగ పూజ
28/04 శంకరజయంతి
28/04 శ్రీ రామానుజ జయంతి
30/04 గంగోత్పత్తి
30/04 విద్యారణ్య జయంతి
01/05 అపరాజితాదేవి పూజ
01/05 చండికాదేవిపూజ
02/05 వైష్ణవ శ్రీరామ జయంతి
02/05 వాసవీ జయంతి
03/05 అన్నవరం కళ్యాణం
03/05 స్మార్త ఏకాదశి
03/05 డొల్లుకర్తరీ ప్రారంభం
04/05 పరశురామ ద్వాదశి
06/05 నృసింహజయంతి
06/05 నోములకు పౌర్ణిమ (రాత్రికాలం)
07/05 కృష్ణాజినదానం, ఉదకుంభదానం
07/05 సముద్రస్నానం
07/05 దధ్యన్నవ్యజన ఛత్ర పాదుకోదానాని కర్తవ్యాని
07/05 సంపద్గౌరీవ్రతం
08/05 యాగకాలం
09/05 పార్థివకల్పం
11/05 పెద్ద కర్తరీ ప్రారంభం
14/05 వృషభ సంక్రమణం ప్రవేశాత్ పూర్వతః
15/05 చండికాదేవి పూజ
17/05 హనుమజ్జయంతి
18/05 మతత్రయ ఏకాదశీ
21/05 మాసశివరాత్రి
22/05 సర్వేషాం అమావాస్య
22/05 పిండపితృయజ్ఞం

## జ్యేష్ఠ మాసం

23/05 యాగకాలం
24/05 చంద్రదర్శనం
24/05 సోపపదం
25/05 రంభావ్రతం
26/05 ఉమాపూజ
26/05 భౌమ చతుర్థి
26/05 మహాచతుర్థి

28/05 కర్తరీ త్యాగం
28/05 ఆరణ్యకగౌరీ పూజ
30/05 శుక్లాదేవీ పూజ
31/05 బ్రహ్మాణీదేవి పూజ
01/06 దశపాపహర దశమి
01/06 సేతుబంధన రామేశ్వర ప్రతిష్ఠ
02/06 మతత్ర నిర్జల ఏకాదశి
03/06 రామలక్ష్మణద్వాదశి
05/06 నోములకు పౌర్ణిమ
05/06 ఏరువాక పౌర్ణిమ
05/06 అన్వాదానం
05/06 బౌచ్ఛమన్వాది
05/06 సావిత్రీవ్రతం
05/06 తిలపాత్రదానం
06/06 యాగకాలం
07/06 వృషభపూజ
08/06 యవనాబ్ద ప్రవేశం
09/06 శుక్రమూఢమి త్యాగం
09/06 భౌమచతుర్థి
13/06 త్రిలోచన పూజ
14/06 మిథున సంక్రమణం ప్రవేశాత్ పూర్వతః
17/06 మతత్రయ ఏకాదశి
18/06 కూర్మజయంతి
19/06 మాస శివరాత్రి
20/06 సర్వేషాం అమావాస్య
21/06 వటసావిత్రీ వ్రతం
21/06 పింపియజ్ఞం
21/06 సూర్యగ్రహణం

## ఆషాఢ మాసం

22/06 చంద్రదర్శనం
23/06 పూరీ జగన్నాథ రథోత్సవం
26/06 స్కంధ పంచమి
26/06 కుమారషష్ఠి
27/06 వివస్వత్సప్తమి
28/06 మహిషాసురమర్దినీపూజ
29/06 ఐంద్రీదేవి పూజ
30/06 చాక్షుషమన్వాది
30/06 మహాలక్ష్మీ వ్రతం
01/07 మతత్రయ శయన ఏకాదశి, తొలిఏకాదశి
01/07 గోపద్మ వ్రతం
02/07 ప్రస్వాపన మహోత్సవం
02/07 వాసుదేవ ద్వాదశి
02/07 చాతుర్మాస్య వ్రతారంభం
04/07 పవిత్రార్చనం
04/07 నోములకు పౌర్ణిమ
04/07 కోకిలా వ్రతం
05/07 సముద్రస్నానం
05/07 వ్యాసపూజ
05/07 యాగకాలం
07/07 చాతుర్మాస్యద్వితీయ
12/07 భానుసప్తమి
13/07 ధర్మసావర్ణిమన్వాది
14/07 ఐంద్రీదేవీ పూజ
16/07 మతత్రయ ఏకాదశి
16/07 గురు ఏకాదశీ
16/07 కర్కాటక సంక్రమణం మధ్యాహ్నాత్ పూర్వతః
18/07 శని త్రయోదశి
19/07 మాసశివరాత్రి
20/07 సర్వేషాంఅమావాస్య
20/07 పింపియజ్ఞం
20/07 అమా సోమవారవ్రతం

## శ్రావణ మాసం

21/07 యాగకాలం
22/07 చంద్రదర్శనం
23/07 మధుశ్రవావ్రతం
24/07 నాగపూజ
24/07 దూర్వాగణపతివ్రతం
25/07 నాగపంచమి
26/07 సూర్యషష్ఠి
28/07 కౌమారీదేవి పూజ
29/07 దధివ్రతారంభం
30/07 మతత్రయ ఏకాదశి
30/07 గురు ఏకాదశి
31/07 దామోదర ద్వాదశి
31/07 పవిత్రారోపణం
31/07 వరలక్ష్మీవ్రతం
01/08 శని త్రయోదశి
03/08 హయగ్రీవోత్పత్తిః
03/08 విఖనస జయంతి
03/08 రాఖీ పౌర్ణిమ
03/08 ఉపాకర్మ (యజుర్వేద)
04/08 యాగకాలం
04/08 ఋగ్వేద ఉపాకర్మ
05/08 బృహత్కల్ప ద్వితీయ
05/08 అశూన్య శయన వ్రతం
07/08 సంకట చతుర్థి
11/08 స్మార్త శ్రీకృష్ణాష్టమి
12/08 బుధాష్టమి
12/08 కౌమారీదేవీ పూజ
15/08 మతత్రయ ఏకాదశి
16/08 సింహ సంక్రమణం మధ్యాహ్నాత్ పరతః
17/08 మాస శివరాత్రి
18/08 సర్వేషాం అమావాస్య

18/08 రుద్రసావర్ణిమన్వాది
18/08 కృష్ణాంగారక చతుర్దశి
19/08 యాగకాలం
19/08 పిండపితృయజ్ఞం
19/08 కుశగ్రహణం
19/08 పోలావ్రతం

## భాద్రపద మాసం

20/08 చంద్రదర్శనం
20/08 శైవమౌనవ్రతం
20/08 మహత్తమ వ్రతం
20/08 కల్కి జయంతి
21/08 వరాహ జయంతి
21/08 తామసమన్వాది
21/08 షోడశోమావ్రతం
21/08 హరితాళికా వ్రతం
21/08 మధుశ్రవా వ్రతం
21/08 సువర్ణగౌరీ వ్రతం
22/08 వినాయక చవితి
22/08 శివాచతుర్థీ
22/08 గౌరీపూజ
22/08 సామగోపాకర్మ
23/08 ఋషి పంచమి
23/08 బౌద్ధజయంతి
24/08 సూర్యషష్ఠి
24/08 స్కంద దర్శనం
25/08 ఆముక్తాభరణ సప్తమి
25/08 మహాలక్ష్మి వ్రతారంభం
25/08 దూర్వాష్టమీ
26/08 బుధాష్టమి
26/08 జ్యేష్ఠావ్రతం
26/08 కేదారవ్రతం
26/08 నందాదేవి పూజ
28/08 క్షీరవ్రతారంభం
29/08 పరివర్తన ఏకాదశి మతత్రయ
29/08 కటదానం
30/08 శక్రద్వాదశి
30/08 విష్ణుపరివర్తన మహోత్సవం
30/08 కల్కి ద్వాదశి
30/08 వామనజయంతి
30/08 శక్రధ్వజోత్థాపనం
01/09 అనంతవ్రతం (ఉదయికీగ్రాహ్య)
01/09 నోములకు పౌర్ణిమ
02/09 ఉమామహేశ్వర వ్రతం
02/09 లోకపాల పూజ
02/09 యాగకాలం
02/09 మహాలయ పక్షప్రారంభం
03/09 అశూన్యశయన వ్రతం
04/09 బృహత్యుమావ్రతం
04/09 ఉండ్రాళ్ళ తద్ది
05/09 హరితాళికావ్రతం
07/09 మహాభరణీ
08/09 చంద్రషష్ఠి
10/09 సూర్యసావర్ణిమన్వాది
10/09 మహాలక్ష్మివ్రతం
10/09 మధ్యాష్టమి
11/09 అహిర్నవమి
11/09 దుర్గాదేవ్యుద్వాసనం
13/09 మతత్రయ ఏకాదశి
14/09 యతిమహాలయం
15/09 గజచ్ఛాయ
15/09 కలియుగాది
16/09 కన్యా సంక్రమణం మధ్యాహ్నాత్ పరతః
16/09 శస్త్ర హతమహాలయం
16/09 మాస శివరాత్రి (ప్రదోష వ్యాప్తి ఉన్నది)
17/09 కుశగ్రహణం
17/09 మహాలయ అమావాస్య
17/09 పిండపితృయజ్ఞం

## అధిక ఆశ్వయుజ మాసం

18/09 చంద్రదర్శనం
18/09 యాగకాలం
27/09 మతత్రయ ఏకాదశి
02/10 యాగకాలం
06/10 భౌమచతుర్థీ
13/10 మతత్రయ ఏకాదశి
15/10 మాసశివరాత్రి
16/10 సర్వేషాం అమావాస్య
16/10 పింపియజ్ఞం

## నిజ ఆశ్వయుజ మాసం

17/10 యాగకాలం
17/10 దసరా ప్రారంభం
17/10 స్తవవృద్ధి గౌరీవ్రతం
17/10 తులా సంక్రమణం ప్రవేశాత్ పరతః
18/10 చంద్రదర్శనం
18/10 ప్రీతిద్వితీయ
20/10 ఉపాంగ లలితావ్రతం (సాయంకాలం)
20/10 భౌమ చతుర్థి
21/10 నాగపంచమి
21/10 సరస్వతీ పూజ
23/10 దేవీత్రిరాత్ర వ్రతం (వైదిక సాంప్రదాయం)
24/10 దుర్గాష్టమి
24/10 మహానవమి

24/10 స్వారోచిషమన్వాది
25/10 విజయదశమి
25/10 సరస్వత్యుద్వాసన
25/10 అపరాజితాదేవిపూజ
25/10 శమీ పూజ
25/10 దానఫల వ్రతారంభం
27/10 మతత్రయ ఏకాదశి
28/10 గో ద్వాదశి
28/10 పద్మనాభ ద్వాదశి
30/10 కౌముద్యుత్సవం
30/10 అక్షక్రీడా
30/10 నోములకు పౌర్ణిమ (రాత్రిపౌర్ణిమ విశేషం)
31/10 ఆగ్రయణం
01/11 యాగకాలం
01/11 పాతార్కయోగం
03/11 అట్లతద్ది
11/11 మతత్రయ ఏకాదశి
13/11 మాస శివరాత్రి
13/11 నరక చతుర్దశి
13/11 అస్యాం అపరరాత్రౌ స్నాత్యంభ్యంగం.
14/11 యమతర్పణం
14/11 దీపావళి
14/11 అలక్ష్మీనిస్సరణం
15/11 ఆకాశదీప ప్రా॥
15/11 కేదారవ్రతం
15/11 గోక్రీడనం
15/11 బలిపూజ

## కార్తీక మాసం

16/11 భగినీహస్తభోజనం
16/11 చంద్రదర్శనం
16/11 అఖండదీప ప్రారంభం
16/11 మంగళమాలికా
16/11 యమపూజ
16/11 వృశ్చిక సంక్రమణం ప్రవేశాత్ పరతః
17/11 త్రిలోచన గౌరీ వ్రతం
18/11 నాగుల చవితి
19/11 నాగ పంచమి
20/11 తుంగభద్రా నదీ పుష్కరాలు ప్రారంభం
22/11 గోష్ఠాష్టమి
23/11 కృతయుగాది
23/11 విష్ణుత్రిరాత్ర వ్రతం
24/11 యాజ్ఞవల్క్య జయంతి
25/11 స్మార్త (బోధన) ఏకాదశీ
25/11 భీష్మ పంచక వ్రతం
26/11 స్వాయంభువమన్వాది
26/11 క్షీరాబ్ధి పూజ
26/11 చుల్కువ్రతం
26/11 యోగినీద్వాదశి
28/11 వైకుంఠ చతుర్దశి రాత్రి వ్యాప్తి.
28/11 శని త్రయోదశీ ప్రదోషం లేదు.
29/11 పాషాణ చతుర్దశి
29/11 నోములకు పౌర్ణిమ
29/11 త్రిపురోత్సవం
29/11 జ్వాలాతోరణం
29/11 కుమారస్వామి దర్శనం
29/11 వృషోత్సర్గః
30/11 దక్షసావర్ణిమన్వాది
30/11 ధాత్రీపూజ
30/11 కార్తీకవ్రతోద్యాపన
30/11 తులస్యుద్వాసన
01/12 యాగకాలం
01/12 అశూన్యశయనవ్రతం
02/12 చాతుర్మాస్యద్వితీయ
07/12 సావిత్రీ కల్పం
11/12 స్మార్త ఏకాదశి
11/12 గోవత్స ద్వాదశి
12/12 శనిత్రయోదశి
13/12 మాస శివరాత్రి
14/12 సుఖరాత్రి
14/12 కౌముద్యుత్సవం
14/12 సర్వేషాంఅమావాస్య
14/12 పిండపితృయజ్ఞం
14/12 అమాసోమవార వ్రతం

## మార్గశిర మాసం

15/12 యాగకాలం
15/12 ధనుర్స్సంక్రమణం మధ్యాహ్నాత్ పరతః
15/12 చంద్రదర్శనం
17/12 రంభావ్రతం
20/12 సుబ్రహ్మణ్య షష్ఠి
20/12 మల్లారషష్ఠి
20/12 సంహారషష్ఠి
20/12 చంపాషష్ఠి
21/12 మిత్రసప్తమి
21/12 నందాసప్తమి
22/12 కాలభైరవాష్టమి
23/12 ప్రళయకల్పం
23/12 నందినీదేవి పూజ
25/12 మతత్రయ ఏకాదశీ (ముక్కోటి)
25/12 గీతాజయంతి
26/12 మత్స్య ద్వాదశి
26/12 అఖండ ద్వాదశి
27/12 హనుమద్వ్రతం

28/12 పాషాణ చతుర్దశి
29/12 దత్తజయంతి
29/12 చంద్రపూజ
29/12 సువర్ణ, లవణ దానం
30/12 యాగకాలం
31/12 పరశురామజయంతి (సాయంకాల వ్యాప్తి)
05/01 తిస్రోష్టకములు
06/01 బుధాష్టమి
09/01 మతత్రయ ఏకాదశి
11/01 మాస శివరాత్రి
12/01 సర్వేషాం అమావాస్య
12/01 కృష్ణాంగారక చతుర్దశీ
13/01 యాగకాలం
13/01 భోగి
13/01 పింపియజ్ఞం

## పుష్య మాసం

14/01 మకర సంక్రమణం ప్రవేశాత్ పరతః
14/01 చంద్రదర్శనం
14/01 మకరసంక్రాంతి
15/01 కనుమ
16/01 గురుమూఢమి ప్రా॥
24/01 రైవతమన్వాది
25/01 కూర్మద్వాదశి
28/01 తూలపరీక్ష
29/01 యాగకాలం
04/02 తిస్రోష్టకము
07/02 స్మార్త ఏకాదశి
10/02 మాసశివరాత్రి
10/02 అనత్రయం
11/02 సర్వేషాం అమావాస్య
11/02 పిండపితృయజ్ఞం

## మాఘమాసం

12/02 కుంభ సంక్రమణం మధ్యాహ్నాత్ పరతః
12/02 యాగకాలం
13/02 చంద్రదర్శనం
14/02 గురుమూఢమి త్యాగం
14/02 గుడలవణదానం
14/02 శుక్రమూఢమి ప్రా॥
15/02 సోపపదం
15/02 తిలచతుర్థీ
15/02 శాంతచతుర్థీ
15/02 వరచతుర్థీ
15/02 కుందచతుర్థీ
16/02 మదన శ్రీ పంచమి
18/02 వైవస్వతమన్వాది
19/02 రథసప్తమి
19/02 సూర్యజయంతి
19/02 దానఫలవ్రతోద్యాపన
19/02 భీష్మాష్టమి
21/02 నందినీదేవిపూజ
23/02 భీష్మ పంచకవ్రతం
23/02 భీష్మ ఏకాదశి
23/02 భీమ ఏకాదశి
23/02 తిలపద్మవ్రతం
24/02 భీమద్వాదశి
24/02 వరాహద్వాదశీ
24/02 సోపపదం
25/02 వరాహకల్పం
26/02 నోములకు పౌర్ణిమ
27/02 మహామాఘీ
27/02 సముద్రస్నానం
28/02 యాగకాలం
05/03 తిస్రోష్టకములు
10/03 తిల ద్వాదశి
11/03 మాసశివరాత్రి
11/03 మహాశివరాత్రి
11/03 ఆరంటతీ చతుర్దశీ
13/03 ద్వాపరయుగాది
13/03 సర్వేషాం అమావాస్య
13/03 పిండపితృయజ్ఞం

## ఫాల్గుణ మాసం

14/03 మీన సంక్రమణం ప్రవేశాత్ పూర్వతః
14/03 చంద్రదర్శనం
14/03 యాగకాలం
17/03 తిలచతుర్థీ
17/03 పుత్రగణపతివ్రతం
21/03 లక్ష్మీసీతాయశ్చ పూజ
24/03 స్మార్త ఏకాదశి
25/03 నృసింహద్వాదశి
27/03 కామదహనం
28/03 బ్రహ్మ సావర్ణి మన్వాది
28/03 హోళీ
29/03 వసంతోత్సవం
29/03 యాగకాలం
30/03 చాతుర్మాస్య ద్వితీయ
31/03 బ్రహ్మకల్పం
03/04 తిస్రోష్టకము
04/04 భానుసప్తమి
07/04 స్మార్త ఏకాదశి
10/04 మాస శివరాత్రి
11/04 సర్వేషాం అమావాస్య
12/04 యాగకాలం
12/04 పింపియజ్ఞం
12/04 అమాసోమవార వ్రతం
13/04 ఉగాది
13/04 చంద్రదర్శనం

